ఆంధ్రరత్న

# గోపాలకృష్ణుని చాటువులు







గోష్ఠి ప్రచురణాలయము,

అమలాపురం

1964 ] [ 40 న పై

## పీఠిక   2785/RO

ఆంధ్రరత్న గోపాలకృష్ణుని 'చాటువు' లను చిన్న పొత్తమును యిప్పటికి ముప్పదియేండ్ల క్రిందట మొదటిసారిగ ప్రచురించియుంటిమి. నాటికి నేడిది ద్వితీయముద్రణ. ప్రథమ, ద్వితీయ ముద్రణలలోని భేదములు బహు స్వల్పములు. "ఎంకిపాటల" పై గోపాలకృష్ణుని తీక్ష్ణవిమర్శ కొన్నిచోట్ల అశ్లీలముగ నున్నదని ముఖ్యముగ మిత్రులు (శ్రీ) ఆచార్య రంగాగారి కోరికపై యీసంపుటిలో వదలివేయబడినది. ఇట్లనే రెండు అసంపూర్తిపద్యములును తీసివేయబడినవి. అనేకమిత్రుల కోరికపై ఆంధ్రనాయకుని గూర్చిన పద్యము నూతనముగ యిచ్చట జేర్చబడెను.

ఇందలి పద్యముల సంఖ్య బహుస్వల్పము అయినను వీని నేల ప్రచురించవలెను?

(1) ఆధునిక ఆంధ్రులలోనేగాక యావద్భారతమందును గల మహామేధావులలో మన ఆంధ్రరత్న మొక్కడు. అట్టి వాడు తన సమకాలీక ఉద్యమములు, వ్యక్తులు, పై గూర్చి అప్పుడప్పుడు "చాటువు" గా జెప్పిన భావములు చారిత్రిక ప్రాముఖ్యత బడయగలవని నా అభిప్రాయము,

ష్పదు "ముందుగతుత్తో ఖామందువీవు" అను సూక్తి భక్తిమార్గములో అత్యున్నతమగు 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అనుస్థితిని సూచించును "ఆంధ్రవాణీవిలాసము" లోని "నీదు కోడలిమానంబు నిలుపవయ్య" అనునది పిల్లలమర్రి పినవీరభద్రుని "వాణి నారాణి" సంప్రదాయమును జ్ఞప్తికి దెచ్చును. ఆ ధర్మనాయకులందలి లోపములు వర్ణింపుచు 'తపములేసిదె యెన్నరే నేరములెల్ల? అనుసూక్తి సంపూర్ణ భక్తిశ్రద్ధలతో గూడిన తపోదీక్షయే మనకెల్లరకు శరణ్యమని బోధించును ఇట్టి మహనీయుని చాటుపద్యములు ఆంధ్రమహాజనులకు సంపూర్ణ సమాదరణీయము లగునని ఆశించుచున్నాను

గోష్ఠి అమలాపురము<br>క్రోధి సం॥ర చైత్ర శు ౧ లు<br>(15-3-1964)

గుమ్మిడిదల వెంకటసుబ్బారావు

శ్రీరస్తు

# ఆంధ్రరత్న గోపాలకృష్ణుని చాటువులు.

## శ్రీరంగనాథ ప్రబోధము



కదా వా కావేరీవిమలసలిలప్రాఙ్గణనట
చ్ఛుభాఙ్గం శ్రీరఙ్గం తమిళహృదయధ్వాన్తదళనమ్
తనోత్యాతిథ్యం మే నిజసదసి బద్ధచ్యుతియుతే
మహార్తైత్యాక్రోశ న్నిమిషమివ నేష్యామి దివసాన్ ॥ ౧

కదా వా శ్రీరఙ్గే భవరసతరఙ్గే ఫణితలే
శయానం స్వారాజ్యాసన ఘనశయానం హృదిభజన్
అయే రఙ్గస్వామిన్ తమిళజనసంభావితవిభో
ప్రసీదేతి క్రోశ న్నిమిషమివ నేష్యామి దివసాన్ ॥ ౨

శ్రీరఙ్గేశ కృపాళో తమిళజనసభాధ్యక్షదీక్షాంతరఙ్గ
స్వారాజ్యానన్దనిద్రాపరవశ ద్రుతముత్తిష్ఠ భో రఙ్గనాథ
త్రేతాయాం రామచన్ద్రాకృతిధృతభవతా ప్రీణితైర్వాన్దం
స్త్వాంన్ధ్రోహం వర్తమానాం తవభవనకథాంవక్తుమత్ర
తోస్మి ౩

పాదీభాగే విరాగే జగతి సతతం తీవ్రమంగాప్రిషికాభ్యాం
హీనస్థానే భూతే ధృతభరతసుతప్రాణహారే కృపాణే
ఆస్థ్రియాం పాదపిద్యానగరనృపయశశ్శృఙ్గభఙ్గావసానే
ఆయాతా స్వర్గజాతా వణిజగణమిషే శాత్రచిత్రాస్థతన్త్రా ॥

బిభ్రాణా వామసత్యం ప్రసితమద పృథివ్యాంతుసంపాద్య దేశాన్
ద్వీపాన్ యూరప్పమిషాం స్తదను దశదిశాక్రాన్తఖండాన్త
రస్థాన్
ఏషా సామ్రాజ్యలక్ష్మీ జ్వలితరవికిరణ ప్రాంశుమాలా విశాలా
తేషెత్వతాన్తనిద్రాపరవశరమయస్వామ్యసర్వార్థభూమ్యై

వాణిజ్యార్థం సమాజః పరికలితమతో౽నేకవర్షాన బాష్పి
దార్వ్యావర్తప్రివృత్తాఖిలకలహాతలేపంచతన్త్రప్రిపఞ్చమ్
నిక్షిప్యాక్షిప్య రాజ్ఞాం క్రమగమితమధాసేతుశీతాచలాన్తం
ఆఙ్గ్లే రాజ్యే ఖముమిళితి మభూత్తస్య వశ్యావయంతు ॥ ౬

తూష్ణీమాధిక్యస్తదానీం గతవినుతనియన్తృస్వాన్త సంజాతనీతిః
విద్యాతత్వప్రాచ్యవిద్యా విపశుజలఫలోద్భూతపాషాణపశ్యా
యాతి క్లాన్తిం ధరిత్రీ లవణమపి పణాగ్రిస్తమాస్తక్యసూన్యాః
నిస్తేనాస్తే ప్రిజావై హ్యాతసకలకలోద్భూతసిద్ధ్రాదరిద్రా ॥ ౭

ధర్మవ్యాఖ్యానదానాధ్యయనజపతపశ్శీలసత్యవ్రతాదీన్
సన్యస్యన్సీయడ— సరధచరా భూసురాదోషపూరా

అన్యైశ్శిక్షాగ్రహైర్న్యైస్త్వహితజనవచోద్భిన్నఖిన్నాన్తరఙ్గః
సర్వైస్సాంగ్లేయదేశత్రిణభరణకణా ప్రీతిముత్పాదయద్భిః ।

దృష్ట్వాదాస్థిత్యమేతద్వ్యధికృతమితి సంశోధ్య కారుణ్యసాన్ద్రి
వ్యామోహవ్యూహదాహావ్రితతులితగృహీతాగ్రిసత్యాగ్ర
హో యః

ప్రేమాశాస్త్రప్రశాస్త్రవ్రితప్రణుత మహీ మోహనాజోఽ
మహాత్మా

గాన్ధిస్స్వారాజ్యగర్ధ్యవిచలదఘనాసఖ్యవైముఖ్యమోగమ్॥

(ది 2–10–1922 తేదీన శ్రీరంగములోఁ జెప్పినవి )

# శ్రీ రామలింగేశ్వరస్వామి

(ఈ పద్యము శ్రీరామనగరున 7-3-1925 న శ్రీరామాలయమున
శంకుస్థాపనచేయు సమయమునఁ జెప్పఁబడినది)

సీ॥ శ్రీగిరిజాసతి స్మితముఖాంభోరుహ
సారస్యమధుపానసమయములను
బ్రహ్మాదిమునిముఖ్య ప్రార్థితదానవ
సంతానసంహారసమయములను
వరకుచేలాదిభూసురభక్తసంత్రాణ
సంగంధపాద్యార్ఘ్యసమయములను
నవయుగోదయవేళ భవసమంచితవస్తు
సంతానముసృజించుసమయములను

తే॥ గీ॥ ప్రళయతాండవ మద్దడలిఁ వెలయు
రాజరాజేశ్వరీతనోరాజ్య మేలు
సమయముల నాదుఁ బలుకులజాడ వినుము
రామనగరీవరాంగ! శ్రీరామలింగ!



## శ్రీ రామచంద్రుఁడు

శ్రీవిభుఁడు శ్రీరామచంద్రుఁడు
భూవిభుఁడు కోదండరాముఁడు
భువిని వెలసెను రామనగరిని
కవిజనాశ్రియుఁడై ॥

శ్రీవరుఁడు సుగుణాభిరాముఁడు
భవుఁడు శ్రీకోదండరాముఁడు
అవనిభారముఁ బాప మాపురిఁ
బవనసూనుని గూడి వెలసెను
కవనగాన వినోదవాఙ్మయ
నవన మర్పింతున్ ॥

—

# ప్రతిమారాధన

(ది **2-2-26** న గుంటూరుపురమున వేమనశతకము లోని యీ క్రింది పద్యములను జదివినమీఁదట జెప్పిన పద్యములు )

ఆ॥ తోఁకకడుపులోనఁ దొడ్డవాఁడుండఁగ
రాతిగుళ్ళ నేల రాశిఁబోయు
రాయి దేవుఁడైన రాసులమ్రింగదా
విశ్వదాభిరామ వినుర వేమ

ఆ॥ శిలలఁజూచి నరులు శివుఁడని భావింత్రు
శిలలు శిలలె కాని శివుఁడు కాఁడు
తనదులోని శివుఁడు దా నేల తెలియఁడో
విశ్వదాభిరామ వినుర వేమ

## ఆంధ్రరత్న సమాధానము

శిలలోన గల్గు జీవునిఁదెలియక
వాని నిశ్చలతయు వానిపరతఁ
దెలియ కిట్లు బ్రేలఁ దెలివియాయెనట నీకు
వినయ మెపుడుగల్గు వెఱ్ఱివేమ ?

తోలుకడుపువాఁడు సోలెఁడైనను గోరు
రాశియైనను శూన్యరాశినైన
ముట్టకుండ నెచ్చు చట్టుదేవుఁడు గోరి
తెలియ కిట్లు తూలితేల వేమ ?

—•—

# శ్రీ మంగళగిరి నృసింహస్వామి

( ఆంధ్రరత్నము 1926 సం॥రములో కొంతకాల మౌషధసేవఁ జేయుచు మంగళాద్రియం దుండెను అప్పటినుండి తా 23-6-26 న తామన [illegible] చెప్పిన పద్యములు )

ఉ॥ ఎండల కోర్వలేక యిటు లింటికి వచ్చితి నంతె కాని నీ
యండను వీడలేదు భవదంఘ్రియుగంబు సదా మదీయహృ
న్మండలి నిల్పినాఁడ ననుమానము వీడవె నాదుజాడ్యమున్
డెండవె మంగళాద్రినరసింహ! సుధాలయ! పానకాలయా॥

ఉ॥ ఎండల కోర్వలేకజామి యింటికివచ్చితి మంగళాద్రికిన్
రెండవసాటి రామనగరిక్షితియంచును దొల్లి త్రేత కా
లాంచపురామచంద్ర విమలాకృతితో నటు నీవ కావె మా
కండగనిల్చి ప్రోతువు శుభాద్రినృసింహాయ! పానకాలయా॥



# మహాత్ముని యుపవాసము

(1924 సంవత్సరమున ఢిల్లియందు జరిగిన శ్రీగాంధిమహాత్ముని యుపవాస సందర్భమునఁ జెప్పిన పద్యము)

సీ॥ వాదవైఖరిఁ దోలి వేదాంతరతిఁ దేలి
స్వారాజ్యపారంబుఁ జేరుకొఱకు
వ్యవహారనయసమన్వయభవ్యమార్గ మా
నేత్వగ్రస్థలిఁ బ్రతిష్ఠించుకొఱకు
హింసావధాగత ధ్వంసితాధర్మంపు
వంశం బహింసచే వర్ధిలుటకు
లోకకళ్యాణమ్ముఁ జేకూర్ప నాత్మార్ప
ణమ్మును నర్షికధమ్ముఁ దుదకుఁ

బూనినాడు మహాత్ముఁడు భూధరమ్ము
బాఁగా నేడు మహాముపవాసవ్రతము
ముక్తిసుమహార్త వేళలు మూఁగిన వీత
తామనగరీనరేంద్ర! (శ్రీరామచంద్ర)

—

# తన్ను గూర్చి

(1920 సం॥రములో మహానందియందు జరిగిన యాంధ్రమహాసభా సమయమున బందరు పెద్దలు కొందఱు తనను 'సుంకర కొండ'' యని యెగతాళిగా నిచ్చిన జబాబు ఇందు తాను శంకరుని యపరావతారమని చెప్పుకొనెను)

క॥ బింకాలు పలుకు బందరు
హుంకల హుంకార మెల్లఁ గిడ్వడసేమన్
శంకరుఁడె మహానందిని
సుంకరకొండాయె యాయెఁ జోద్యం బేరా ?

*          *          *          *

సీ॥ వేదాంతములతోడ వెక్కిరింతలతోడ
 లెక్చర్లు సాగించు లీల నెవఁడు
లక్ష్మమ్మ కోటిరేక యక్షగానములతో
 కాలంబు వ్యర్థంబుచ్చు ఘనుఁ డెవఁడు
చీరాల పేరాల చిన్నగ్రామంబుల
 దోస మెన్నక కొంపఁదీసె నెవఁడు
'ఆంధ్రరత్నం' బంచు నహమికతోఁ బెద్ద
 పిన్నలంచును మది నెన్నఁ డెవఁడు
[ఆంధ్రరత్నం బంచు నధమపక్షము సుంకరి
 కొండడై యరికోటిఁ జెండు నెవఁడు]
అట్టి గోపాలకృష్ణుని హాస్యసరళి
గోలకృష్ణునిఁగాఁ జేసి కొలతఁదీర్చెఁ
గాక(పట్టి) పగ్గములుండునే "గాడ్డు" కైన
రామనగరీనరేంద్ర! (శ్రీరామచంద్ర)! [1925]

# నాన్కోఆపరేషన్ నాయకులు

సీ॥ గాంధిదేవుని రాక కంచుఢక్కలుఁ గాక
కరతాళశబ్దాల దరువుఁగోరె*
దేశబంధునిదశ ద్వీపపాలతోఁ దీరె
రాజగోపలచారి బూజుఁబట్టె
కొండవెంకటప్పన్న ఉండిలేకుండెను
బాయిషశేట్లు నిర్భాగ్యులైరి
లాలలజపతిరాయి కోలుపోయెను శ్రద్ధ
చండి సరోజిని పండిపోయె
అలీయుఁ గోలిలుఁ గేళిసవాట్ మాని
ఖాళిగ తాలీలపాలఁబడిరి
జమ్నలాలూసెట్టి తుమ్నవీటుఁబట్టి
ఖద్దరుకాన్సబ్ సద్దుచుండె

మొదటితాకిడి కింతట మోసమయ్యె
ఖ్యాతి కెక్కఁడు ఒక్కె మా మోతిలాలు
ముందుగతు లెట్టులౌనో ఖామందు వీపు
రామనగరీనరేంద్ర! శ్రీరామచంద్ర!



* "పురుషోత్తముఁ డనుకొన్నాము ఉత్తమపురుషుఁడైనాఁడు"

# ఆంధ్రవాణీవిలాపము

సీ॥ రామలింగారెడ్డి సీమరాజుల షెరిఫ్
చేరి నన్ బొందంగ గోరుచుండె
గంధికోవటి నన్ను హిందిచే నెట్టించి
బందిలోఁ బెట్టింపఁ బంపుచుండె
పండితుండనువాడు తిండికై వెండికై
చండాలుకడనైన నుండుచుండె
కోతిమేరు కవిగాళ్ళుగతు లయోమయములై
నన్ను వీథినిఁబెట్ట నెన్నుచుండె

అకట! దిక్కెవ్వరింక నా కవనియందు
అనుచు నేడ్చుచున్నది యాంధ్రవాణి
నీదు కోడలిమానంబు నిలుపవయ్య
రామనగరీనరేంద్ర! శ్రీరామచంద్ర!

* * * *

సీ॥ దావోర్ల రామణ్ణ సీమలో మెచ్చారు
యెంకిపాటలు నింగి కెక్కుచుండె
వంగవాసి ఘటర్జి నింగిలీషు కజన్ను
మెచ్చి గ్రంథాల్యాప్రి చ్చువేసె

* కవుతరయ్యాకమాళ్ళ ఖండాంతరంబుఁ
గొప్పగొప్పళ్లంచు గొలపుట్టి
అడవిబావడిపెరు పడలే దదింకాను
వడుతుంది దొరలలోఁ బడినయపుడు

కళలు పుష్పెకు తెలుగులగడ్డలోన
ననుచు "క్రిటికులు" ఘోషింతు రౌనుగాని
మనకుమాత్రము గన్పింపమానె నేమొ
రామనగరీనరేంద్ర! శ్రీరామచంద్ర!



---

* కవుతా శ్రీరామశాస్త్రిగారు

# బాపట్ల

సీ॥ భావనారాయణస్వామి నీమముఁ బూను
గుడిలోని వేదాంతగోష్ఠితోను
శివదివాణము కాడ 'సనిమ నాట్యమ్మాడ
సంధ్యాటన వీడు సాంబశివుఁడు
దేశాంతరులనీతి క్లేశాంకముగఁ బాతి
ఆశాంతమును జూతు రవనిసురలు
వతుగలింతుం లేక యితరు లంతను రాక (శి)
రసికత్వము హసించు రాజవీధి

పంచభూతములవి బారె సంచులను
పుర మరాతులదయ్యెను భూతమేమొ!
బాగుఁజేయుము బాపట్ల వేగ మీవు
రామనగరీనరేంద్ర! శ్రీరామచంద్ర!



# నరసారావుపేట

సీ॥ గృధ్రవాయసవానభద్రిభాఁగి వాసించు
మిద్దెకొండలకాంతి మేహాకాంతి
కంబంగారంబుఁ గడుపారఁ గన్నకం
సాల కౌశిక కట్టి నేలమట్టి
లంకాపురాధీశు పంకాలలోఁ బుట్టి
పైఁబడి బ్రతిమాలు పైరుగాలి
శాలికాడు కోటయ్య యిలవీడ కొండెక్క*
గంగ పొచ్చెను భూమిగర్భశరణ

అకట' నరసన్నరాయుని వికటపేట
గగన మొకరాటి కల దాదుఁ గఱపుదీర
గాక నేగెదె ప్రఁవీడి కాననముకు
రామనగరీనరేంద్ర' శ్రీరామచంద్ర॥

---

* కోటప్పకొండ

# గుంటూరుపురము

(గుంటూరులో పురపాలకసంఘము తరఫున గ్రంథాలయము తెఱచు సందర్భమున నేను అస్వస్థతగా నున్నందున కూర్చొని యుపన్యసించెదనని గోపాలకృష్ణుడు చెప్పగా సభలో నెవ్వరో 'అస్వస్థతగా నుండగా నెందుకిచ్చటికి వచ్చినారని యసభ్యముగాఁ బల్కిరి. అందుపై సభలో గ్లోలము చెలరేగెను. తుదకు గోపాలకృష్ణుఁ డీపద్యము ఆశువుగా జెప్పి [illegible]కులను దృష్టించి సభను శాంతింపఁజేసెను)

సీ॥ సకలోద్యమవ్యాప్తి కకలంకనిలయమై
            శరణిచ్చుపురము గుంటూరుపురము
  తిక్కనాదిమహాంధ్రదిగ్గజేంద్రవిహార
            సారభూతలము గుంటూరుపురము
  దేశకల్యాణసందేశనిర్వహణాఖ్య
            యోరాధ్యభూమి గుంటూరుభూమి
  ఆ ధాత్రిసని స్వరాజ్యాప్తి యావేళల
            మా రాజధాని గుంటూరుపురము

    నాగ పాలింపుసఖుఁడు శ్రీనడిమిపల్లి
    వ సభా విభుఁడింతేల సరసలిల*
    రాకయుండున పాలింపుఁ జోకయైన
    రామనగరనరేంద్ర శ్రీరామచంద్ర!

* శ్రీ నడిమిపల్లి నరసింహారావుగారు పురపాలకసంఘాధ్యక్షులుగానుండిరి

# గుంటూరివారు

(ది 26-2-26 తేదీన గుంటూరుజిల్లామహాసభకు ఆహ్వానసంఘాధ్యక్షులుగ గోపాలకృష్ణుడు సభికుల కొసంగిన స్వాగతపద్యము)

సీ॥ శ్రీమదాంధ్రావనీ క్షేమమీమాంస వి
స్తారపూరితులు గుంటూరివారు
తిక్కనాది మహాంధ్రదిగ్గజేంద్రవిహార
సారభూవరులు గుంటూరివారు
నిఖిలాంధ్రనేతృత్వ నిరుపమప్రజ్ఞాప్ర
కారపారగులు గుంటూరివారు
ధర్మసంగ్రామసందర్భనిర్భర వాక్య
పూరాగ్రవరులు గుంటూరివారు

వారలిచ్చుచున్నారు స్వాగతము
ధర్మదీక్షితులగు సభాస్తారతతికి
చేరి సటియింపు వారి వ్యాత్సల్యమందు
రామనగరీనరేంద్ర! శ్రీరామచంద్ర!



సీ॥ కొండవెంకటప్పన్న గుండుసున్నగదన్న*
గోపాలకిట్టాయి కొక్కిరాయి ।
టంగుటూరు ప్రకాశ మింగిలీషుపిశాచి
నాగేశ్వరుడు వట్టి నాగుజెముడు ।
పట్టాభిసీతన్న తుక్కుపురుగుగదన్న
ఉన్నవలచ్చుమన్న దున్నపోతు ।
గొల్లపూడిసీతన్న కళ్లులేనికబోది
బులుసు సాంబడు వట్టి పుట్టుకుంక ।
అయ్యదేవరవాడు పెయ్యనాకుడుగాడు
అయ్యంకి రమణయ్య దయ్యమయ్య ।
డాక్టర్ సుబ్రహ్మణ్య మాట్టింగ్ ఫులిస్టాపు
దువ్వూరి సుబ్బమ్మ దృష్టిబొమ్మ ।

అనుచు బల్కుదు రాంధ్రులిల నపనియందు ।
గాంధిశ్రేష్ఠునిమతములో గలసినపుడు ।
తపములేనిదె యెన్నరే జపములెల్ల ।
రామనగరీ నరేంద్ర! శ్రీరామచంద్ర!

* From hero to zero

## ఆంధ్రసభాధ్యక్షులు

సీ॥ ఒయ్యూ నరసిమ్మయ్య బ్రహ్మలోకాన్నుండె
వ్యాకతి సుబ్బన్న చూపుతగ్గ
పానుగంటి విబుధుండు పరమపదాప్తుడై
ప్రభుచెంతను జేరి యొదిగియుండె
మోచర్ల రామన్న ఖేచరుండై యుండె
* కే వి కృష్ణారావు కీర్తిమిగిలె
పట్టాభిసీతన్న గట్టిగా కాలంబు
'జన్మభూమి' నిఁ జేరి జరుపుచుండె

వీరలందఱు మాడరేట్వాదివారు
ఆంధ్రసభ మున్ను నేలి రత్యాదరమున
నేడు మనపాల బడియెను నిశ్చయముగ
రామనగరీ నరేంద్ర శ్రీరామచంద్ర॥



* [illegible] శే॥ పోలవరం జమీందారుగారు

# ఆప్తవాక్యము

(శ్రీయుత వడింపల్లి నరసింహారావుగారికిఁ జెప్పినది)

సీ॥ సత్త్వమూర్తివి నీవు సతత తామసగుణా
క్రాంత ప్రాంతభ్రాంతరంగ మద్ది
దానశీలుఁడ వీవు దానవాంఛితదీన
నిర్ణయాంతరపూరదుర్ణయ మది
త్యాగభోగివి నీవు రాగసాంగత్య సం
జాతపాతకకర్మవ్రాత మద్ది
బ్రాహ్మణోత్తముఁడ వీవబ్రాహ్మణాంగ్లేయ
దాంపత్య దస్సంప్రదాయ మద్ది

అని మునిసిపాలిటి వర్ణింతు ననవరతము*
నాదు ప్రాణంపుసఖునకు నయము మీఱ
గలుగ నిమ్మిప్పు డాత్మీయజ్ఞానపటిమ
రామనగరీ నరేంద్ర! శ్రీరామచంద్ర!

* చీరాల నాయకుఁడైన గోపాలకృష్ణుఁ డీపద్యముఁ జెప్పుట యెంతయు సముచితముగ నున్నది. తన ప్రతిష్ఠిత పురపాలన ‘పానాఽపాన పరిపాలన’ యని యీతఁ డొకానొకసమయమునఁ జమత్కారముగ నుడివెను



## కా శీ నా థు ని  నా గే శ్వ ర రా వు గా రు

సీ॥ ఆంధ్రపత్రికతోడ నమృతాంజనం బిచ్చి
తలనొప్పిఁ బాపెడి ధన్యుఁడెవఁడు
లక్షలాదిగ డబ్బు దీక్షతో సమకూర్చి
భిక్షకోటినిఁగాచు దక్షుఁడెవఁడు
పత్రికాస్ఫురెన్నును గతినీవెయని వేడ
ప్రెసిడెంటుగా నేలు రసికుఁడెవఁడు
మితవాదిహితుఁడౌచు నతివాదగతుఁడౌచు
నందు నిందునుఁజేరు డెవఁడు
అట్టి కాశీనాథుని నాగయార్యాయుఁడు
పుట్టకుండిన నాంధ్రంబు పుట్టిమునిఁగి
గిట్టకుండునె యేనాఁడొ యట్టెనిల్గి
రామనగరీ నరేంద్ర శ్రీరామచంద్ర॥



## టంగుటూరు ప్రకాశంపంతులుగారు

సీ॥ అరవవాగ్వ్యాపార మచ్చు దానొత్తుచు
*మలయాళభగవతిఁ గొలుచునెవఁడు
అగ్నిసాక్షిగఁగొన్న నంబుజాక్షినివీడి
ధనయశశ్శ్రీల తల దగిలెనెవఁడు
ఆంధ్రకాంగ్రెసు సభాధ్యక్షతఁ జేబూని
భారతావని నేలఁ గోరునెవఁడు
లోకసంగ్రహదీక్షఁబూని పైకెక్కి తా
"స్వారాజ్య" మందంగ గోరునెవఁడు

కాలభైరవభీకరోగ్రానల ప్ర
కాశమూర్తియై గ్రాలుఁ బ్రకాశమూర్తి
కలుగ దేశాని కింకేమి గల్గు కొదువ
రామనగరీ నరేంద్ర! శ్రీరామచంద్ర॥



*స్వరాజ్యపత్రిక కప్పటిసంపాదకుడగు కీ॥ శే॥ కె. యం. పనిక్కరుగారు

# కాన్పూరు కాంగ్రెస్

సీ॥ గంగామహాదేవి గంజిపోసినం ద్రాకి
గతిమాలినూరుగా కాన్పూరు
వాల్మీకి ఋష్యాది వాటికలకు వన్నె
కాటి కిప్పటి పేరు కాన్పూరు
భాంతస్వాతంత్ర్యఘోరాహవోద్భవ
ఖడ్గహూళవిహారు కాన్పూరు
వాల్మీకి వాక్కుతో లాల్మిలి* కూతతో
కాస్మపాలిలనూరు కాన్పూరు

నేటికొచ్చిన కాంగ్రెసు వేటగాడు
శక్తి లేదింక నీయెడ భక్తి లేమి
గాక నీయెడ యత్తింటి గతి యదేల
రామనగరి నరేంద్ర! శ్రీరామచంద్ర!॥

---

* లాలిమ్లి మిల్సు

# స్వేత రీతులు

సీ॥ వెంటనె టనె వోయి గుంటజంటను దెచ్చి
యొంటిగంటకు నింట చుంట
పాప్రుదాప్రులఁజేరి కైపు నోపుగఁజేసి
తావ మాపగలేక గ్రోపుచుంట
వాటుహోటళ్లలో దూరి హాటుహాటువి మంచి
యేటుప్లేటుల దెచ్చి యీటుచుంట
రాసవాసములందు దాసిలెస్సీల సం
దేసు గూసులచిందు*లేసు చుంట

స్వేతరీతులు బూతులు నీతు లుత్త
పోలిటిక్సును
డబ్బు దబ్బుగఁ గోల్పోయి డాబుగాను
ఆంధ్రభూమినిఁ దిరుగుదు వాధవాని



*Eat - తినుట

*The ass dance and the goose dance-పాశ్చాత్య నాట్యరీతులు

# చదువు మోపైన చానలు

సీ॥ ప్రక్కకు పాపిళ్ళు నిక్కిన ముక్కోళ్ళు
వాడిపోయినమోము బీడుకళ్ళు
ఎండిపోయిన . పండిపోయిన ముళ్ళు
కాళ్లకు మేజోళ్లు కళ్లజోళ్ళు
మళ్లుగట్టినజుట్టు ముళ్ళుపెట్టినకట్టు
నక్కి గుట్టినబట్ట నడుము తట్ట
సందుచేసినచంక కందిపోయినడొంక
పలుచఁబాఱినతొడ పలకలమెడ

గూనిరెక్కలు చుక్కాని లేనివాణి
పసిడిపళ్ళను ఊల్లిన ముసలిపెదవి
చదువు మోపైన చానలచండ మూర
రామనగరీ నరేంద్ర! శ్రీరామచంద్ర!

# బందరుసభలు

( 1925 బందరు ఆంధ్రరాష్ట్రీయ మహాసభలంగూర్చి )

ఒడాయిక్లోర్లన్న, కాంగ్రెసు
బడాయిక్లోర్లన్న-
బందరులోన సందడిచేసెరి ఒ॥

విందులు చిందులు తందనాలతో
వందలకొలదిగ సందడిఁజేసిరి ఒ॥

పాట్లమాటలను చాటుధారలను
వోటుకు, రైటుకు లోటుపడక బహు
బూటకములతో, నాటకములతో
ప్లాటుపారమున ఘాటుగ వాగిరి ఒ॥



# శాసనసభాబహిష్కారముంగూర్చి

(కారాగారవిముక్తుండై వచ్చుచు తదరాజునగరమునం దిచ్చిన యుపన్యాససందర్భమున జెప్పినది )

న యాచే రిఫారం - నవా స్టీలుఫ్రేముం
న కౌన్సిల్ నతు పీపీకౌన్సిల్ పదం వా
స్వరాజ్యార్థి హాన్తాంగ్ల రాజ్యే నియన్తా
ఫరంగీ ఫిరంగీ దృగంగీ కరోతు॥

—

## హాస్యచక్రవర్తి – దుగ్గిరాల గోపాలకృష్ణయ్య

## కొన్ని ఆంధ్రరత్న సూక్తులు

బెజవాడలో నొక ఆంగ్ల దినపత్రిక స్థాపించవలెనని డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారొకసారి ప్రయత్నించేరు. సభ జరిగింది. 'Wanted an English Organ for Andhras' అని కరపత్రం ప్రచురించేరు. సభలో గోపాలకృష్ణయ్యగారిని మాట్లాడమన్నారు. మొదట నిరాకరించేరు. బలవంతం చేయగా, 'మాట్లాడ్డాని కేముంది? ఇందాకా డాక్టర్ గారే తెలిపేరు – ఇప్పుడాంధ్రులకు ప్రత్యేకంగా Organ లేదు. ఇంతవరకు మనవాళ్ళు బెసెంటుగారి Organ 'New India' పత్రికతోనే కాలక్షేపం చేస్తున్నారు' అన్నాడు – సభంతా గొల్లుమంది.

♦ ♦ ♦ ♦

1920 మహానంది సభలో కొందఱాతనిని "సుందరకాండారు వేషమునీ నేలిచేస్తే, ఆంధ్రరత్న సమాధానం "బింకాలు పలుకు అనేవద్దా" 1924లో చెన్నపురిలో జరిగిన ఆంధ్రమహాసభలో వందనసమర్పణ చేయవలసివచ్చినది. అందఱినీ శ్లాఘించేడు. ఆరోజులలో దేశకంటకులుగా భావింపబడిన సి. ఐ. డీ ల ప్రస్తావ నెత్తుకున్నాడు. ఆంధ్ర

రత్నం 'ఇప్పటి సి. ఐ. డి. లకు కూడా మన వందనాలు వాళ్ళా? మనసభలకి అవసరమే 'వెధవలేని పెళ్ళి వెలవెలపోయిందన్నట్టు, సి ఐ డి లు లేని సభ సక్రికట్టదన్నారు.

♦ ♦ ♦ ♦

గుంటూరు కాంగ్రెసు ఆఫీసుకి ఆంధ్రరత్నం ఒకసారి వెళ్ళేసు శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారు ఖద్దర్ బోర్డు లెక్కలు చూస్తున్నారు 'ఏంచేస్తున్నారు? శాస్త్రులుగారూ! తాకీలు కూడుతున్నారా ఏమిటి?' అన్నారు

♦ ♦ ♦ ♦

1924లో కాంగ్రెస్‌లో స్వరాజ్యపార్టీ "నో ఛేంజి" (No Change) పార్టీలని రెండుపార్టీలుండేవి గోపాలకృష్ణుడు కొంతవరకు స్వరాజ్యపార్టీ అభిమాని రెండోపార్టీని "మారనిపార్టీ" అని చమత్కరించేవాడు ఈరెండింటిలో ఏది మంచిదండీ? అని ఒకరు ప్రశ్నిస్తే, గాంధీగారి మొండితనం కంటె నెహ్రూగారి వెధవతనమే బాగున్నట్టుందండీ!' అని ఆంధ్రరత్న సమాధానము నో చెంజి పార్టీకి ఆరోజులలో గాంధీగారి అభిమానం ఉండేదని ప్రతీతి

♦ ♦ ♦ ♦

1921 లో బరంపురంలో ఆంధ్రసభలు జరిగేయి అందులను తన రామదండులో చేరమని ఆంధ్రరత్నం ఉద్బోధించేడు "అయితే తురకలమాట ఏమిటండీ?" అని ప్రశ్న

వచ్చింది అందుపై ఆంధ్రరత్న సమాధానం "వీరు చంద్ర వంకను ఆరాధిస్తారు శివుడు చంద్రశేఖరమూర్తి రుద్రమూర్తిన్ని ఆతనివలె వీళ్ళున్న రుద్రాభిమానులే తన నెత్తిమీద గంగను అలంకరింపజేసుకోవలసివచ్చుటచేత ఆపె యాజ్ఞపై ఆతడు తన శిరోజములను గడ్డము మీదకు 'ట్రాన్స్ఫర్' చేసుకున్నాడు అందుచేత ముసల్మానులంతా శివభక్తులే మనకు శివకేశవాభేదం గనుక వాళ్లూ ఈరామదండులో జేరవచ్చును అల్లాని కొన్నిచోట్ల 'శంకర్ అల్లీఖాన్' అనికూడ పిలుస్తారు మీకింకా సందేహం వుంటే, హైదరాబాద్ నైజాంగారిప్పటికీ భద్రాద్రిరామునికి ముఖ్యట్రస్టీ కావలిస్తే కనుక్కోండి!" అన్నాడు



సుప్రసిద్ధ కవియైన ఉమర్ ఆలిషా గారొకసారి ఆంధ్ర రత్న రామదండు నుద్దేశించి "రామదండు మిశ్రమ సమూహ మగుటచే దూష్యముకాదా? యని ప్రశ్నించెనట, అందుపై "ఉమ్రాలీషాకవి యేరకమూసమండీ? అని ఆంధ్రరత్న సమాధానము



స్వరాజ్యపార్టీనాయకుడైన చిత్తరంజనదాసు (C R Das) గారిని ఒకసభలో యెదుర్చుచు, "నేనూ ఒక C R దాసునే — చీరాల రామదాసు!" అని చెప్పేరు



ఒకతూరి గుంటూరు ఎ సి కాలేజీలో సభ డాక్టర్ రాధాకృష్ణయ్యగారు (ప్రస్తుత భారతాధ్యక్షుడు) వక్త— ప్రిన్సిపల్ రాయస్ట్రాక్ అధ్యక్షుడు — "India speaks,

America presides" అని ఆ ధ్రిరత్న వ్యాఖ్య.

♦ ♦ ♦ ♦

"అనిబెసాంటుకు మోక్షం వచ్చినా రాకపోయినా, ఆ పెథ క్తులకు తప్పకుండా వస్తుంది గాంధీ అనుచరులకు వచ్చినా, రాకపోయినా గాంధీగారికిమాత్రం తప్పకుండా వస్తుంది"

♦ ♦ ♦ ♦

గయాకాంగ్రెసులో మోతీలాల్ నెహ్రూగారు, ఆయన కుటుంబాన్ని (జవహర్లాల్ కమలా, ఇందిరా, కృష్ణ విజయ లక్ష్మి వగైరా) చూచి 'బందరులో రామసింగు పంచదార చిలకల్లాగున్నారే! అన్నాడు

♦ ♦ ♦ ♦

1923 గయాకాంగ్రెసులో ఒక ఛాందసుడు పట్టుబట్ట కట్టుకొని భోజనానికి వచ్చేడు ఆయనప్రక్కనే కుసుమ ధర్మన్న అనే ఆదిమాంధ్రుడు కూర్చున్నాడు. అప్పు డాంధ్రిరత్నం ఆఛాందసునితో 'శాస్త్రులుగారూ' మీ ప్రక్క కూర్చున్నవారెవరో తెలుసునా ? కుసుమా ధర్మాకథాన్లు గారు! మీరు వెంటనే మీబసలోకి వెళ్ళి బట్టలుమార్చుకొని ఫలహారం చేసినట్టుగా ఈభోజనకాండ పూర్తి చేసుకోండి" అని హెచ్చరించేడు

♦ ♦ ♦ ♦

పాకీదొడ్డిలో గాంధీగారు గీతాపారణ ప్రారంభిస్తే "ఈయన వర్ణ ఆరసిపోడనుకుంటానండీ! అస్పృశ్యత పో గొట్టాలంటే, పాకీమనిషిలో మాతృత్వం చూపించాలిగాని, యీ అపవిత్రత ఎను లేమిటి ?" అన్నాడు, ఆంధ్రరత్నం

ప్రశ్న - మీరు క్రాపింగు ఎందుకు పెట్టుకున్నారండీ?
సమా - అది Universal hair-cut - విశ్వమానవ పద్ధతిగనుక

♦ ♦ ♦ ♦

గాంధీశిష్యులగురించి - "ఇదంతా ఒక ism అండీ - గాంధీ-ism అప్పయ్యదీక్షితులుగారి గోచీఇజమ్ వలె!" అన్నాడు-అంటే దీక్షితులుగారు గోచీ సవరించుకుంటే, శిష్యులూ సవరించుకోవడం మొదలుపెట్టేరుట!

♦ ♦ ♦ ♦

నాన్‌కోఆపరేషన్ రోజులలో చెన్నపురిప్రభుత్వాన్ని రావణాసురునితో పోల్చేవాడు - ఆంధ్రరత్నం గవర్నర్ (విల్లింగ్డన్ ప్రభువు శాసనసభాధ్యక్షుడు, నలుగురు కౌన్సిలర్లు, మూగ్గురు మంత్రులు ఒకపార్టినాయకుడు (పిట్టి త్యాగరాయ శెట్టి)-ఈపదిమంది దానికి పదితలలుట!

♦ ♦ ♦ ♦

ఒకసారి పానుగల్లురాజా (ముఖ్యమంత్రి)) చీరాల వచ్చేడు విభీషణునివలె

వరసీతను వారికిచ్చి-నీదు
తోవను నీవుపోరా-రావణా!

అని పాటులచే పాడించెను

♦ ♦ ♦ ♦

గంజాం జిల్లాలో పదాది శిక్ష విధింపబడి, కారాగారోన్ముఖుడై - "పదవే భద్రాద్రికి - పాపిష్టిఘటమా!" యను గీతాలాపనం

## మరికొన్ని సూక్తులు

"గాంధీగారి అహింసాయుత అసహాయోద్యమంలో అసహాయం కంటె అహింసయే ఎక్కువపాలు', "ప్రహ్లాద సాధనచేస్తే నారసింహంగా పరిణమిస్తుంది, "ఠాగూరు కవిత్వం చేకూరి వెంకటకవి పాకానికైనా రాదు', "పూర్వం రామాయణమైతే యిప్పుడు రామారాయణం' (అప్పటి మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ రాజా రామారాయణం గారు), "గాంధీ పురుషోత్తముడనుకొన్నాము కాని ఉత్తమ పురుషుడైనాడు', "ప్రిధమసమాగంలోకూడా ప్రెస్ కరెస్పాండెంటేనా?, "పరస్పర స్నేహానికి పరిహాసమే ప్రమాణము, "నేనూ ఒక పబ్లికు సంస్థనే', "ఎరిస్టొక్రసి పురపాలన పానాపాన పరిపాలన, శ్రావణమాసంలో సాతాళింపు ధాతువు', "రాజకీయవేత్త రాజ్యమునకు భర్తయేకాని పుత్రుడు కానేరడు—వందేమాతరంభావము రాజకీయములలో దూష్యము, "గురువులకు దక్షిణ యివ్వాలికాని వేతనాలేమిటి?' "కాంగ్రెసుజెండా దూదేకుల జెండా (Spinners Weavers flag)' ఆడన్ శ్రీసతి కొప్పుపై, తనువుపై ఇది Indian definition of a straight line', "బ్రహ్మసూత్రాలు చూడవలసిన వాళ్ళకి యీ కంపెనీ ఆక్టు (Company Act) తెలుగుకడి?" "దేముడు గుంటూరులో యిప్పుడు పొగాకుగా వెలిసేడు', "ప్లస్సూ మైనసూ వేసి చూస్తే, మనరాష్ట్రంలో ఒక్క నాగేశ్వరావుగారే మిగుల్తారు', "'రా' అంటే రాజ్యం, 'మా' అంటే మనది—'రామ' శబ్దంలో స్వరాజ్యం ఉంది".

